REG No M. 2185 REG No N 45

The First Telugu Bi-weekly in Andra Desa, The only Telugu News Paper for H E H The Nizam's Dominions

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపఁబడును

హైదరాబాదు—దక్కన్

103160

GOLAKONDA PATRIKA HYDERABAD Dn

సంపుటము ౫ } ప్రమోదూతనామ సంవత్సర మార్గశీర్ష బ॥ ౧౧ బుధవారము 17—12—30 { సంచిక ౭౬

పలురకముల అచ్చుపనులు బ్లాకు ప్రింటింగు

రూలింగు బైండింగు

| | |
|---|---|
| గ్రంథములు | ఫారములు |
| రసీదుబుక్కులు | నోటీసులు శుభపత్రికలు |
| మోటారుటిక్కెట్లు | లెటరు హెడ్సు |
| సినిమా టిక్కెట్లు | విజిటింగ్ కార్డులు |
| నమూనా ఫారములు | ప్రామిసరీనోట్లు |

తెలుగు ఇంగ్లీషు

అందముగు క్రొత్తటైపుతో సిద్ధము చేయబడిన అచ్చుతప్పులు లేకుండా సరిచూచి నియమిత కాలమునకు తయారుచేసి యిచ్చెదము ముఖ్యముగా జిల్లాల ఆర్డరులు శ్రద్ధతోచేయబడును. సరసమైనధరలు.

మేనేజరు
గోలకొండ పవర్ ప్రెస్
త్రూపుబజారు హైద్రాబాదు

# వ్యవసాయాభివృద్ధిమార్గములు ౧

(శ్రీయుత సర్వోత్తమరావుగారు బి. ఏ.,)

౩

## పైరు సంరక్షణ (పోడన)

పైరును చక్కగా వృద్ధిపొందించి పంటను బాగుగా బడయవలయు నన్న, దానిని గడ్డిగాదమునుండి పరిశుభ్రపఱచి, తెగులు తగలకుండ కాపాడుట యవసరము. సాధారణముగ రైతులు ఖుర్పులతో పేరుదీసి ఒకటిరెండుసారులు మాత్రము కలుపుతీయుంచి పిమ్మట అటు తిరిగినైన చూడరు. ఇది యెంతయు నష్టదాయకము. గాదము యెక్కువగుటచే పైరు వృద్ధిచెందకపోవుట యటుండ తెగులుకూడ పుట్టుటకు కారణ మగును. మఱియు పంటకూడతక్కువ పండును. అసలు పైరుకన్న గడ్డి మొదటే పెరిగి భూమి యాహార మంతటిని పీల్చివేయును. కావున విత్తనము వేయగనే పుట్టుగాదమును మొదలు చేతులతో ఒకటిరెండుసారులు తీసి వేసిపిమ్మట పనిముట్లచే పోతముచేయుట ఉత్తమోత్తమము. ఈ పని కై మొదలగు పరికరములు ఉపయోగకరములు. వీనివలన గడ్డిగాదము పోవుటయేగాక వీనియందు యెక్కువ పదును కమ్మకొని యుండుటకు వీలగును. పాటు సరిగాచేయని భూములు వాన లేకపోవుటవలన త్వరి గా వాడుబట్టు సంగతి యందరెరింగినదియే.

## ఎరువులు

మనుష్యులకు అన్నమెటుల యవసరమో, వృక్షజాతికి యెరువులు కూడ యటులనే అవసరము. కాని మన రైతులు సాధారణముగా యెరువులను సమకూర్చుటయందు మిగుల యశ్రద్ధను కనబరుచుచుందు రు. రైతులు పశువులపెండ మొదలగువానిని పెంట బొందల యందైనను లేక సమభూతలమందైనను,కుప్పలుగావేసి దానిమీదకప్పనుమాత్రము వేయరు. పశువులదొడ్డి సమీపముులో ఎరువు గొయ్యి త్రవ్వి అందు పెంటనుకూడ వేయుచుండవలయును. ఎండదెబ్బకు పెంట సారమంత యు అవిరియయిపోకుండ పెంటగోతి మీదుగా కప్పువేయుట అవసర ము వర్షపునీరు గూడ పెంటపై పడనియగూడదు. యీపని యేమంత భారమైనదికాదు. ప్రస్తుతము వంటచెరుకు దొరకనందున పెండను పిడక లకు యెక్కువగా నుపయోగించుచున్నారు. భూసారమును నిలువబెట్టుట కు సరిపోవు పెండ లభించుటలేదు ఈ లోపమును క్రింది ఉపాయములచే పూర్తిచేసుకొననగును.

(౧) పచ్చిపెంట అనగా వర్షకాలారంభమున జనుము, దాయం చ, మొదలగు పైరు చేయుటకు అనుకూలమగు విత్తనములను పొలము ల లో వేసి అవి పూతకువచ్చునప్పుడు వానిని నాగలితో దున్ని భూమిలో నికి పోవునట్లు చేయవలయును ఇందుచే భూమి మిగుల సారవంత మ గును.

(౨)ఆర్గనిక్ మ్యాన్యూర్ (Organic manure) అనగా పుచ్చు పిండి, చేపలపొట్టు బొక్కలపిండి మొదలగునవి ఉపయోగించవలెను.

౩ కృత్రిమపుయెరువులనగా, అమోనియం సల్ఫేట్ సూపర్ ఫాస్ఫేట్ పొటాషియం సల్ఫేట్ మొదలగువా న్నివి పూర్తి చేసుకొనవచ్చును. ఈ యెరువులను వాడునప్పుడు మిగుల జాగరూకతగా వర్తించవలయును. అవసరమగు పక్షమున వ్యవసాయ శాస్త్రజ్ఞునినుండియైనా లేక వ్యవసాయ శాఖవారిచేనైన తగు ఆలోచన గైకొనుట మంచిది.

## పశుపోషణ

వ్యవసాయము జయప్రదముగ నడువవలయు నన్న, పశువులు బలిష్ఠ ములై యుండుట అత్యవసరము. భారతదేశమందు వ్యవసాయము పశు వులపైననే ఆధారపడి యున్నది ఇవి బలిష్ఠముగ లేనిచో కొద్దిపనియైన ను సరియగు వేళకు ముగింపబడదు. కావున వీనిచే సరిగా పనిచేయించు కొనవలయు నన్న వాని ఆహార పానాదుల విషయమును ఈ క్రింది సూ చనలను ఆచరణయం దుంచుకొనుట అవసరము.

౧ పశువులకు కడుపునిండునట్లు మేతవేయవలయును పచ్చిమేత పట్టిమేత కలిపి వేసిన యెడల పశువులకు నిష్టముగా నుండుటయే గాక వానికి చక్కని పుష్టికూడ యిచ్చును.

౨ పశువులకు వ్రయబడు మేతను తుంటలు తుంటలుగా కొట్టివే యవలయును. ఈపని చాఫ్ కటరు, అనగా చొప్పగోయు పరికరముచే మంచిగా చేయవచ్చును, దీనిచే మేత మిగులును. ఒక పుల్లయైనను పాడు పోదు. ఇదియే చాఫ్ కటరువలన లాభము.

౩ ముఖ్యముగా వేసవి కాలమందు పశువులకు బలువ పెట్టుటకు గాను కొద్దిగనైనా గ్రాసమైనా పచ్చిమేత వేయుచుండుట మిగుల లావశ్యక ము. నీటివసతి గల ప్రదేశములందు కత్తెర చొప్ప వలన ఈ అవసరము ను పూర్తి చేసుకొనవచ్చును. నీటిపారకము లేనిస్థలములందు కాయిలు పద్ధతిపైన పచ్చిచొప్పను దాచిపెట్టుకొనవచ్చును. వర్షఋతువందు మిగులు చొప్పనంతయును ముక్కలు ముక్కలుగా నరుకవలయును. పిమ్మట దానిని యొక గాతునందు తొక్కించవలెను గాతుదరికి, చొప్పకును డుమ కొంతమాత్రము సందు నుండగూడదు. ఉన్నచో లోపల గాలి ప్రవేశించి చొప్పను నాశనమొనర్చును. గాతును నీరుపోజాలని మిట్టప్ర దేశమున పొడుగుగా త్రవ్వించుట మంచిది. చొప్ప నింపునప్పుడు నేల మట్టమునకన్న రెండుమూడడుగులు యెక్కువ యెత్తుగానింపి గానిని మన్నుచే కప్పవలెను. తదుపరి యవసరమున్నప్పుడు దానిని బైటికి తీసి పశువులకు వేసుకొనవచ్చును. కొద్దిగ అలవడిన పిమ్మట యనిదానిని మిగుల ప్రీతితో తినును. ఈవిధముగ పచ్చిమేత యెక్కువ కష్టములే కుండగనే వేసవికాలములందు లభించును గాతునుండి మరల చొప్పతీ యునప్పుడు దానిని సాధ్యమైనంత త్వరగా ఖాలీచేయవలసి యుండును. కావున చొప్పనింపుటకు చిన్నచిన్న గాతులను మాత్రమే సిద్ధపరచుట అవసరము. వివరములు వ్యవసాయ శాఖవారినుండి బడయవచ్చును

౪ ప్రతిదినము పశువులకు కొంతయైన బలమునిచ్చు ఆహారము అ నగా దాన యిచ్చుచుండవలయును. తెలకపిండి, శనగపప్పు, ఉలవపిండి మొదలగు పదార్థములలో ఉప్పుతో కలిపి యిచ్చుట శ్రేష్ఠము.

## ధాన్యవిక్రయ విధానము

మనదేశమున రైతులకు పండిన ధాన్యమును విక్రయించు విధాన ము తెలియక చాల నష్టమునకు గురియగుచున్నారు. పంట పండినతో డనే మంచిధాన్యమును చెడ్డధాన్యమును వేరువేరు చేయవలయును, ఈ పద్ధతి ఆంగ్లభాషలో గ్రేడింగ్ (Grading) యని పిలువబడుచున్నది. ఇటుల విభజింపబడిన ధాన్యమును అంగడిలో వేరు వేరుగ విక్రయించవల యును, మనరైతు సోదరులు చెడుధాన్యమును మంచిధాన్యములో కలిపి యెక్కువధర వచ్చునను భ్రమచేకలుపుదురు ధాన్యమునుబజారులలోఅమ్మ జూపుచుందురు. నిజమేమనగా దీనివలన చెడుధాన్యముతోపాటు మంచి ధాన్యముకూడ ధర తగ్గిపోవును, మన రైతుసోదరు లవలంబించు ప ద్ధతి లాభమునకు బదులు నష్టము తెచ్చిపెట్టుచున్నది రైతులు తమతమ గ్రామములయందు ధాన్యవిక్రయ సంఘములను స్థాపించి ధాన్యమును సాధ్యమగునంతవరకు యెక్కువధర కమ్ముటకు ప్రయత్నించవలయును. వేరువేరు విక్రయించు టకన్న అందరుకలసి అమ్ముకొనుట మిగుల లాభకరము. రైతుల అడ్తిదార్ల మోసమునుండి తప్పించుకొనుటకు వివిధ స్థలములందలి బజారుధరలు తెలుసుకొనుచుండవలయును.

## వ్యవసాయ సంఘస్థాపన

రైతులు స్థానికావసరములను పూర్తిచేసుకొనుటకు వ్యవసాయ సంఘములను స్థాపించుట మిగుల యవసరము, కాని ఈసంఘముయొక్క బాగోగులు సభ్యులయం దలి పరస్పర సహకార భావముపైన ఆధారప డియుండును. ఇట్టి సంఘములయొక్క ముఖ్యాదర్శములుకొన్ని ఈక్రింద సూచింపబడినవి

౧ స్థానిక వ్యవసాయము యొక్క చిక్కులను తొలగించుకొనుట

౨ విలువగల పరికరములను సంఘము ద్రవ్యమునకుకొని అది రికిరాడ అదుబాటులో సంఘసభ్యులకు కొద్ది బాడుగపైన సంఘసభ్యు లకు యిచ్చుచుండవలయును.

౩ సభ్యులకు సాధారణముగ నిత్తిపైన వ్యవసాయ అవసరములకే కాక కుటుంబముయొక్కఅవసరములకుగూడకొంతఅప్పుయిచ్చుచుండుట.

౪ ఇతరదేశముల వ్యవసాయపు స్థితిని గురించి తెలియజేసికొను చుండుట

౫ అప్పుడప్పుడు సభల సమావేశపరచి స్థానిక వ్యవసాయపు స మస్యలను కూలంకషముగాతో పరిష్కరించుట.

౬ రాబడి యెక్కువ కలిగినట్టియు, లాభకరము లైనట్టియు, సభాగమున వృధాపోనట్టియు పంటలను మాత్రమే పండించుట.

సంఘముయొక్క మూలధనము సభ్యుల చందావలననే గాక వ్యవసాయశాఖవారి సహాయముచేగూడ ప్రోత్సహించవచ్చును. అనేక స్థలములయందు పక్కమ పద్ధతులపైన నడిపింపబడుచున్న ఇట్టిసంఘము లు మిగుల లాభదాయకముగ రుజువు అగుచున్నది కావున మా రైతు సోదరులు మేము సూచించిన విషయములను మిగుల దీర్ఘదృష్టితో విచా రించి సాధ్యమైనంతవరకు ఆచరణయందుంచుటకు ప్రయత్నింతురని న మ్ముచున్నాము. దేశాభివృద్ధికి పాటుపడవలయునన్న ఇంతకుతప్ప వేరు మార్గములేదు.

# భగవద్గీతారచన కాలము

(ఒక విమర్శకుడు)

శ్రీమద్భగవద్గీత యిప్పటికి సుమారు ౫౦౦౦ సంవత్సరముల క్రితము రచింపబడినదని కొందఱును, క్రీస్తుపూర్వము ౧౫౫౦ లో రచింపబడెనని కొందఱును, క్రీస్తు ప్రథమ శతాబ్దమున రచింపబడి రెండవ శతాబ్దమున పరిష్కరింపబడి ప్రస్తుత రూపమున నున్నదని మఱికొందఱును, అభిప్రాయ పడుచున్నారు

మఱియొక్కరు మహాభారతమువంటి భయంకరయుద్ధ సమయమున నధ్యాత్మిక జ్ఞానబోధినియగు గీతను నుపదేశించుట సంభవమని వాదించుచున్నారు. ఇంకొక విజ్ఞుడు మహాభారత యేకల్పితమని సిద్ధీకరించెను.

వేదసమానమై అపౌరుషేయమై జ్ఞానదీపికయై విరాజిల్లుచున్న యీగీత యుద్ధాత్పూర్వమే రచింపబడి ఇతిహాసాఖ్యానముల భారతములో చేర్పబడినదని నొక విమర్శకుడు, తర్వాత కూర్పబడినదని మఱొక మహానుభావుడు తలకొక్కరీతిగా చెప్పుచున్నారు

యుద్ధకాలము నిర్ణయించిననేగాని గీతాకాల మేర్పడదు గాన తత్పూర్వరంగమై నగ్గడింతము,

౧ ఏతత్కలియుగం నామ అచిరాద్యత్ప్రవర్తతే"

[వనపర్వము అ. ౧౮౮ శ్లో ౩౮]

అనగా ఇదిగో కలియుగము ఇది మొదలైపోవ్వుచున్నదివము లైనది.

౨ అన్తరే చైవ సంప్రాప్తే కలిద్వాపరయోరభూత్
స్యమన్తపంచకేయుద్ధం, కురుపాండవసేనయోః

ఆదిపర్వము 2,13

అర్థము — కలిద్వాపర సంధికాలమున కౌరవ పాండవసేనలు స్యమంతపంచకె (కురుక్షేత్రము) మందుపోరిరి,

౩ అస్మిన్కలియుగేప్యస్తి పునః కౌతూహలం మమ

వనపర్వ 160 3

అర్థము — ఈ కలియుగమందును నాకుతూహల మగుచున్నది.

౪ ప్రాప్తంకలియుగం విద్ధి ప్రతిజ్ఞాం పాండవస్యచ

గద 32, 23

అర్థము,— పాండవుల ప్రతిజ్ఞయు కలియుగమును వచ్చెనని తెలిసికొనుము

పై ప్రమాణములవల్ల యుద్ధమునకు కలిప్రవేశించి ఎంతకాలమయినదియు తెలియుటలేదు, ఐన అచిరాత్ అనుటచే కలియుగముయొక్క ఆరంభదశయని వేద్యమగుచున్నది, సంధిశబ్దము దీనిని ప్రతిపాదించుచున్నది. లేనిచో ద్వాపరశబ్దప్రయోగము కాకుండెడిది

౫ విష్ణోర్భగవతో భానుః కృష్ణాఖ్యోసౌ దివంగతః
తదావిశత్కలిర్లోకం పాపేయద్రమతేజనః ॥ ౨౯ ॥
యావత్సపాదపద్మాభ్యాం స్పృశన్నాస్తేరమాపతిః
తావత్కలిర్వైపృథివీంపరాక్రాన్తుం నచాశకత్ ॥ ౩౦ ॥
యదాదేవర్షయస్సప్త మఘాసువిచరన్తిహి
తదాప్రవృత్తస్తు కలిర్ద్వాదశాబ్దశతాత్మకః ॥ ౩౧ ॥

భాగవతము ౧౨–౨

అర్థము —విష్ణ్వంశ సంభూతుడగు కృష్ణపరమాత్ముడు పరంధామమున కేగిన తర్వాతనే కలియుగమారంభ మయినది పాపకర్మలకారంభదశ యిదియే ఎంతవరకు రమాపతి పృథ్విని తన పాదములచే తట్టుచుండెనో ఆ తవరకు కలిప్రవేశింప లేకుండెను ఆ కాలమున సప్తఋషులు మఘానక్షత్రమందుండిరి, అప్పుడే కలి ప్రవేశించి ౧.౨౦౦ వత్సరము లయ్యెను

కలియారంభమునందే యుద్ధమారంభ మయినట్లు పురాణములందనేక ప్రమాణములు కలవు, పరమాత్ముడున్నంతవరకు కలి తన ప్రభావమును చూపజాలక పోయెను.

కాశ్మీర వాసియగు కల్హణకవి తన రాజతరంగిణి యందు

శతేషు షట్సుసార్ధేషు, త్ర్యధికేషు చ భూతలే,
కలేర్గతేషు వర్షాణా మభూవన్కురుపాండవాః ॥ ౫౧ ॥
ఋక్షాదృక్షంశతే నాబ్దైర్యాత్సుచిత్రశిఖండిషు,
తచ్చారే సంహితాకారై రేవందత్తోత్ర నిర్ణయః ॥ ౫౫ ॥
ఆసన్మఘాసుమునయః శాసతి పృథ్వీంయుధిష్ఠిరే నృపతౌ
షడ్ద్విక పంచద్వియుతః శకకాలస్తస్య రాజ్యస్య ॥ ౫౬ ॥

[ప్రథమ తరంగము]

అర్థము —కలియుగమున [౬౫౩] వర్షములైన పిదప కౌరవ పాండవులు జన్మించిరని సంహితాకారులు వ్రాయుచున్నారు ఋషులు నూరు సంవత్సరముల కొకతూరి యొక నక్షత్రమునుండి యింకొక నక్షత్రమునకేగుదురు ఆ కాలమున వారు మఘానక్షత్రమున నుండిరి. కావున శకమందు ౨౫౨౬ కలిపిన ధర్మజుని రాజ్యకాల మేర్పడును

ఇత్యాది గర్గసంహితనుబట్టి వ్రాసిన దంతయుగాని యాకీ విషయమే తెలుపు బృహత్సంహిత యందిట్లు కలదు,

సైకావళీవ రాజతి ససితోత్పల మాలినీసహాసేవ
నాథవతీ వదిగ్యైః కౌవేరీ సప్తభిర్మునిభిః ॥ ౧ ॥
ధ్రువనాయకోప దేశాన్నరినర్తీ వోత్తరా భ్రమద్భిశ్చ
యైశ్చారో హం కథయే సద్వృద్ధగర్గమతాత్ ॥ ౨ ॥
ఆసన్మఘాసు మునయఃశాసతి పృథ్వీం యుధిష్ఠిరే నృపతౌ
షడ్ద్విక పంచద్వియుతః శకకాలస్తస్యరాజ్ఞశ్చ ॥ ౩ ॥
ఏకైకస్మిన్నృక్షే శతం శతం తేచరంతి వర్షాణాం
ప్రాగుత్తరతశ్చైతే సదోదయంతే ససాధ్వీకాః ॥ ౪ ॥

అర్థము.—పైరెండు శ్లోకములలో ఋషులవర్ణన కలదు తక్కినరెండింటిలో] ఆకాలమున సప్త ఋషులు మఘానక్షత్రమందుండిరి. (శాలివాహన) శకమందు ౨౫౨౬ కలిపిన ధర్మజుని రాజ్యకాల మేర్పడును. వారు ప్రతినక్షత్రమందు ౧౦౦ వర్షములుండుచుందురు సతియగు అరుంధతి సహా ఈశాన్యమున నుదయింతురు,

కల్హణుడు బృహత్సంహితను బట్టి వ్రాసినట్లు అందుండెత్తుకొనిన "ఆసన్మఘాసుమునయః" యను వాక్యమే ప్రమాణము. తరంగిణిలో ౫౬ వ శ్లోకాంతమందు 'రాజస్య' యనియు బృహత్సంహిత ౩ వ శ్లోకాంతమున 'రాజ్ఞశ్చ' యనియు కలదు ఐన 'రాజ్ఞశ్చ' యను పాఠమే శుద్ధమయి, ధర్మజుని కాలమును తెల్పుచున్నది.

పైన వ్రాసిన శకవిచారణ నల్పము ఆధునికులు బృహత్సంహితలోని శకము శాలివాహనుని శకము కాదని వ్రాసిరి. కొందరు శక సంబంధమయిన ఏ యితర రాజుకాలమో కాని శాలివాహనము కాదనిరి. కొందరు గర్గుని వచన ప్రమాణము వరాహమిహిరుడు వ్రాసిరంటను, కొందరు గర్గకాలమున శాలివాహన శకమే లేకుండెననుచు. ఇంకకొందరు వరాహమిహిరుడు విక్రమాని యాస్థానికుడు విక్రముడు శాలివాహనునికన్న ౧౩౫ వర్షములు పూర్వుడు వాడు. పై శ్లోకము లందు ప్రయోగింపబడిన శకము శాలివాహనముగాక శాక్యని హమయి యున్నది ౨౫౨౬ లో శాక్యము కలిపిన కలియారంభము ధర్మజుని ప్రభుత్వ కాలము నేర్పడును అని అందురు.

పైన వివరించిన ఇరుపక్షముల సిద్ధాంతము లబద్ధములు. వరాహమిహిరుడు విక్రమునికన్న ౧౩౫ వత్సరములు పూర్వుడుకాడు వారు పంచసిద్ధాంతకమం దుగ్రహముల స్థిరపరచిన దానిలో శకాబ్దము ౪౨౭ అని స్పష్టముగా కలదు రెండవది గర్గుని యాధారముపై సప్తఋషుల చలనము వ్రాయనైనది వారే యాధారముపై ఋషుల సంచారము వ్రాసిరో యదే బృహత్సంహిత భాష్యమందు శకాబ్దము ౮౮౮ లో భట్టోత్పలుడు క్రిందివిధముగ లిఖించెను:—

"కలిద్వాపర సంధౌతుస్థితాస్తే పితృదైవతమ్,
మునయోధర్మనిరతాః ప్రజానాం పాలనేరతాః ॥

అర్థము,—సప్తఋషులు కలిద్వాపర సంధి కాలమున మఘా నక్షత్రమునందుండిరి వారు ప్రజాపాలన ఫల మిచ్చుచుండిరి:

కాశ్మీర్యమైన గర్గసంహిత ప్రకారము వరాహమిహిరుడు ఋషుల సంచారము లెక్కించెను గాని ౨౫౨౬ శకమందు కూర్చి ధర్మజుని రాజ్యకాల మేర్పరచుట యెవ్వటను లేదు,

వరాహమిహిరుడే యాధారముపై నిట్లు వ్రాసెనో విచారింతము. స్కంద పురాణమందు,

తతోత్రిషు సహస్రేషు దశాధిక శతత్రయే
భవిష్యం నందరాజ్యంచ చాణక్యోయాన్హనిష్యతి ॥

అనగా ౩౩౧౦ సంవత్సరములైనవెనుక నందరాజ్యమును చాణక్యులు నాశనమొనర్చిరి. ఆధునికుల మతానుసారము మహానందుని పౌరాణికులందునిగా పరిగ్రహించి వారి కాలమును ౨౪౪౦ సంవత్సరములలో స్కంద పురాణపు ౩౩౧౦ కలిపిన ౫౭౫౦ అగును ఇది ధర్మజుని రాజ్యకాలము యొక్క ౬౩ కలిపి మహానంద వంశముయొక్క ౧౦౦ తీసివేసిన ౫౭౧౩ మిగులును ఇందు వర్తమాన కలిశకాబ్దము ౫౦౩౦ న్యూనపరచిన ౬౫౩ వరాహమిహిరుడు చెప్పిన కాల మేర్పడును. కొందఱు పైన వివరించిన అర్థమును సమ్మతించరు అట్లుకాక ఈ క్రిందరీతిగ నందురు —

"ద్విసహస్రేషు ద్విసహస్రస్య మధ్యే నిర్ధారణ సప్తమీ దశాధిక శతత్రయే స్థితేషుతిశేషః। తథాచనవత్యధిక ద్విసహస్ర శతపర్యాప్తే ఇత్యర్థలాభః। నందరాజ్యమిత్యస్యాపి నందవంశరాజ్యమిత్యర్థః, ఉత్తరవాక్యే యోజితనిర్దేశాత్" (సంస్కృత చంద్రిక)

అర్థము,—ద్విసహస్రేషు అను శబ్దము షష్టివిభక్తి గనుక ౩౧౦ వత్సరము లధికము కలవు ౨౦౦౦ లో అనగా ౧౬౯౦ కలిశకాబ్దమందు నందునిరాజ్యము కలదు.

దీనివలన వరాహమిహిరుడు ఋషిపరివర్తనాధారము పై కలిశకాబ్దము ౬౫౩ లో ధర్మజుని కాలము నిర్ణయించినట్లు తేలును. అప్పుడు ౨౯ నక్షత్రములు వ్యతీతమయ్యెను.

ఇట్లయిన ౨౯౫౩ వర్షము లగును. ఇది యాతఁడు ౪౨౭ లో వ్రాసినట్లు నెంచిన ౨౯౫౩–౪౨౭–౨౫౨౬ ఇదే బృహత్సంహితలో వ్రాసినకాలము. [సశేషము]

## గోలకొండ బుక్ డిపో

| | |
|---|---|
| ౧ రెడ్డికుల నిర్ణయచంద్రిక | ౧-౮-౦ |
| ౨ సంఘోద్ధరణము | ౦-౮-౦ |
| ౩ పంచముల చరిత్ర | ౦-౮-౦ |
| ౪ భారతీయ స్త్రీ ధర్మములు | ౦-౪-౦ |

ఈ నాలుగు గ్రంథములు ఒకేసారికి తెప్పించుకొనువారికి. ౧ శివప్పన్న చరిత్రము ౨ శ్రీకంఠ రామశతకము ౩ బమ్మెర పోతనామాత్య విజయము ౪ క్షయవ్యాధి ౫ కృష్ణాలహరిమొత్తము ఒక రూపాయి పుస్తకములు ఉచితముగ నివ్వబడును. తపాల ఖర్చులు వేరు.

కాల్లకుబూలియ్యతులు నూటికి రు ౩ లు,

గోలకొండ బుక్ డిపో
౧౪౦౯, తూప్రుబజారు హైద్రాబాదు దక్కను

## బ్రాహ్మణ సుదర్శన హోటలు
**(Sudershan Hotel)**
అఫ్జల్ గంజ హైద్రాబాదు

విశాలమైనగదులు, పరిశుభ్రమైన రుచికరమగు భోజనము నగరమునకు మధ్యన ఆఫీసులు. కార్యాలయములు, పాఠశాలలు, మార్కెటులు బజారు మొదలగునవి అందుబాటులో గలవు. ఒకసారి దర్శించిన అన్నియు విశదము కాగలదు. ధరలు అతిచౌక. వెంటనే వివరములు కనుగొనుడు.

మేనేజరు

## గోలకొండ పత్రిక

### ఏజంట్లు

హైదరాబాదు

I జీ. ఆర్. మూర్తి రబ్బర్ స్టాంపు మేకరు గౌలిగూడ

2 నా. శారికొంకరవర్మ రెసిడెన్సీబజారు

3ఇ ధర్మయ్యాచార్యులుగారు భువనగిరి జిల్లానల్లగొండ

## డోంగ్రేగారి బాలామృతము

ఉపయోగించుట వలన

బలహీనతను
పోగొట్టును

బిడ్డలకు బలమునిచ్చి

సౌఖ్యము కలిగించును

ఒక బుడ్డి వెల ౧ రూపాయి

పోస్టు ఖర్చులు ౯ అణాలు

ఎల్ల చోటులందును దొరకును
K. T, DONGRE & Co.
GIRIGAUM, BOMBAY




## అమృతాంజనము

తలనొప్పులు, పార్శ్వపు నొప్పులు, పక్షవాతము, బెణుకులు, తేళ్లు, పాములులను గోలకొండకు వజ్రాయుధము

అమృతాంజనము డిపో
మద్రాసు బొంబాయి

## గోలకొండపత్రిక
తూప్రుబజారు హైద్రాబాదు దక్కను.

సంవత్సరము చందా

రు. ౭-౦-౦
అర్ధ ,, ౩-౮-౦

[illegible]

Printed Fublished by G. Ramakrisna Reddy at Golakonda Power Press, Hyderabad, Dn. Editor K. Balakishna Reddy.